శ్రీ

# గ్రంథావతారము

---

మ॥ ధరణిం బిల్లలమఱ్ఱివంశమణి యు
ద్యద్వేదవేదాంగసం
భరితుం డధ్వరసంచయార్జితహవి
ర్భాగాభిసంతోషితా
మరుఁ డుర్విన్ శ్రీత్రిపురాంబికార్చకుఁడు స
న్మాన్యుండునా చంద్రశే
ఖర నామాంకిత యజ్వశేఖరుఁడు లో
కస్తవ్యుఁడై యొప్పెడిన్॥

ఉ॥ ఆపరమార్థవిత్తముని యు
న్వయమందున విప్రరత్నమై

పావనయజ్వఁగల్గి తలఁ
పన్ పులిచింతలయగ్రహారమున్
భూపతి వేడఁగా కొనిమోఁ
బుత్రికలందునఁ జేరి భూమ లెం
తేపనిఁదాల్చి బాల తన
యింటఁ జరించుఁ దపంబదెట్టిదో॥

గీ॥ వెలయు పాపనయజ్వకు వేంకటపతి
సోమయాజి, లక్ష్మీపతి సోమయాజి
మనమలైరి లక్ష్మీపతి ఘనుఁడుగనిమొ
నతితపస్వి వేంకటకృష్ణ యజ్వవసుని॥

ఉ॥ వేంకటకృష్ణయజ్వకిల
వేరుసమానుడు గల్గడంచని
శ్శంకగఁదెల్పవచ్చు గురు
శంకరుఁడాతని వందనంబుగా
జంకెను వేంకటాద్రిపృప
చంద్రుఁడువచ్చి పరీక్షసేయ ని

శ్యంకతఁ జిత్రయోగముల
సల్పెను వారి ప్రభావమెట్టిదో ?

కం॥ తగునని యిడఁగొనియె బుధుఁ
డగు వేంకటకృష్ణయజ్వ యన్వయమెల్లం
దగ జీవింపఁగఁగారణ
మగు మలకాపురము నగ్రహారముగాఁగన్ ॥

సీ॥ కలితయశుండు వేంకటపతి యజ్వతా
నుబ్బయాఖ్యానుఁడౌ సుతునిగాంచె
పరగనాబుధుఁడు సుబ్రహ్మణ్యమనుపుత్ర
వర్యుఁగాంచెను బుణ్యకార్యనిరతు
నంతసుబ్రహ్మణ్య మన్నపూర్ణంబోలు
నన్నమ్మయను కన్నెమిన్నయందు
నాగలింగంబు, కృష్ణయ పూర్ణసిద్ధాంతి
దక్షిణామూర్తినా దనరునట్టి
నందనచతుష్టయముఁగనె నందమొంద
నందుఁ బూర్ణయసిద్ధాంతి యఖిలదేశ

ములను సిద్ధాంతిమణియశమ్మును గణించి
యమలమతిని బ్రహ్మీభూతుఁడయ్యెఁదాను ॥

సీ॥ వసుధబిల్లలమఱ్ఱి వంశాబ్ధిచంద్రుండ
నంగనొప్పెడి నాగలింగమణికి
వితతసద్గుణగణాన్విత వేంకమాంబకు
నాత్మజులిరువురం దగ్రసుతుఁడు
సోమయాజులు బుధస్తోమమాన్యుఁడు మహో
ద్యోగయుతుండు పరోపకారి
యగ్రజసన్నిభుం డమలగుణుండు మా
నితకీర్తిబుధుఁ డాంజనేయశాస్త్రి
హితుఁడత్త్వచింతాభిరతు ములుకుట్ల వేం
కటకృష్ణనామునిఁ గాంచినన్ను
తెలుపుఁడిటమాకు నిలువేల్పు త్రిపురసుంద
రీమహాదేవి స్తవమన, నే ముదంబు
గుదుర నక్షత్రమాలిక గూర్చి భక్తి
వెలయ జగదంబకిది సమర్పించినాఁడ ॥

చ॥ ప్రకటయశోవిశాలు రతి
భాసురభవ్యకళావిశారదుల్
వికసితరాజకీయ పద
వీ మహితాత్మకులైన సోమయా
జికి మఱి యాంజనేయునకు
శ్రీసుత భాగ్యచిరాయురాదులు
త్సుకతనొసంగి యాత్రిపుర
సుందరి। బ్రోచుత నెలకాలమున్॥

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీత్రిపురసుందర్యై నమః

శ్రీ శివాయగురవేనమః

శ్రీగణేశ్వరాయనమః శ్రీ మహాసరస్వత్యై నమః



# శ్రీత్రిపురసుందరీనక్షత్రమాల

ఉ॥ శ్రీకరుణాకటాక్ష నత
సేవకపాలన బద్ధదీక్షను
శ్లోకమనీషిపక్షమణి
శోభితభూషణ వక్షభక్తవాం
ఛాకలనాతిదక్ష నిను
సంస్తుతిసల్పెద బ్రోవుమమ్మయ
స్తోకదయాబ్ధివై త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 1

చ॥ అజునకు సృష్టిశక్తి, దను
జారికిరక్షణశక్తి, నావృష
ధ్వజునకు సర్వసంహృతివి
ధాయకశక్తి నొసంగియెల్లఱుం
భజనమొనర్ప నిత్యమహి
మ౯ వెలుగొందుచు నాదిశక్తివై
సుజనులబ్రోతువో త్రిపుర
సుందరిమంజుల కంబుకంధరీ॥ 2

చ॥ ధవుఁడఖలజ్ఞుఁడీశుఁడు సు
త్రప్రవరుల్ సకలార్చనీయులుగ
నవతిమహోగ్రపాతకవి
నాశినిగేహము వెండికొండనే
భవమున సర్వమంగళ వి
భాసురనాకము బోలియేలయుం
చు విడకుమమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 3

చ॥ అరయగ నామరూపముల
నందని పెన్మిటి, బెండ్లియాడినీ
నిరుపమశక్తిచేఁ బతిక
నేకవిధంబగు నామరూపముల్
విరచనఁజేసి పూజ్యవయి
వీడకయుంటివి నీచమత్కృతుల్
సారిదివిచిత్రమో త్రిపుర
సుందరిమంజులకంబుకంధరీ॥ 4

ఉ॥ వేదములాటపట్లువిధి
విష్ణుశివుల్ ప్రియనందనుల్, నిలిం
పాదులు సేవకుల్, స్థితిల
యాదులునీకువిలాసముల్, వికుం
ఠాదులుబొమ్మరిండ్లు, మహి
తాత్ములచిత్తమువాస, మజ్ఞతా
సూదననీకు శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 5

ఉ॥ అమ్మ, మొరాలకింపగద
వమ్మ, సదాగతివంచునిన్ మదిన్
నమ్మితినమ్మ, పూర్ణకరు
ణంగనుమమ్మ, పరాకుబూనకో
యమ్మ, దయాబ్ధివమ్మ, శర
ణంటిఁగదమ్మ, ధ్రువంబునిన్ విడం
జమ్మనిశమ్ము శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 6

చ॥ కినుకనిరాకరింప నప
　　　　కీర్తిఁ, మొరల్ వినకున్న గర్వ, మ
న్యునిదరి జేరనీమపరు
　　　　వుండదు, జాలినిబూన్వధర్మమె
ల్లను జెడుఁ, గాననన్ను సుతు
　　　　లాగునగాంచిప్రతిష్ఠనిల్పుమీ
సునుగొనకమ్మ శ్రీత్రిపుర
　　　　సుందరి మంజులకంబుకంధరీ॥ 7

చ॥ మొరలిడ నాదుచెంతకు వి
　　　　భుఁ విడి రామన సొప్పదో, నిరం
తరమును రాజితాద్రిపయి
　　　　తర్షలుదీరవా, యట్టులైన నీ
వరసహితంబుగా నిటకు
　　　　వచ్చి విరాజిత మన్మనోగిరిఁ
సురుచి వసింపుమో త్రిపుర
　　　　సుందరి మంజులకంబుకంధరీ॥ 8

ఉ॥ పండితకోటులైనను భ
వత్సుఖకంద నితాంత నిర్మలా
ఖండ సరోజజాండ ముఖ
కారణ విస్మయ రూపమెన్న లే
కుండిరి నేనునేర్తునన
నొప్పునె, వాదనమాచరింతు దా
నుండని బ్రోవుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 9

చ॥ అరులకుఁ జూడమేమరభ
యావహ, మర్భకకోటి దృష్టికిన్
సురుచిర దివ్యమంగళము
సూరులకున్ సకలార్థ మూలమున్,
నిరుపమ తత్త్వవేత్తలకు
నిత్యసుఖంబగు నీస్వరూపమే
సురలకు నెన్ననా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 10

చ॥ పురుషులు పూరుషార్థములఁ
బూని పనుల్ ఘటించువేళ నిర్
స్థిరమతి నెంత్రుముం దఖల
సిద్ధిగొనర్చెదవంచు, నెల్ల మం
దిరముల సుందరీ మణులు
నిత్యసువాసినివంచు నిన్నదర్
సొరిది నుతింతురో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 11

చ॥ అభవుని కొమ్మ, నన్నిటుల
నారడిబెట్టుట మేలటమ్మ, నీ
దు భజనమాననమ్మ, యిక
దోషములెన్నకుమమ్మ నాదు హృ
త్సభనిలుమమ్మ, దుర్గతుల
దార్చకుమమ్మ. నిరంతరంబునర్
శుభములనిమ్మ, శ్రీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 12

ఉ॥ భక్తి గలుంగువారలకు
భాగ్యము భోగ్యము కార్య ధుర్య ధీ
యుక్తిజనానురక్తి మహి
తోన్నతశక్తి సుభుక్తిముక్తినా
సక్తినొసంగు దాత్రివని
చాలగ వేడితి గాననాకిదే
సూక్తిఘటింపుమా త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 13

చ॥ అతులిత సద్వరంబులిడు
నట్టి సురల్ గలరైనగాని యా
యితరులొసంగు తద్వరము
లెల్లను నీకొక గోటిలోనికిన్
జతపడ, వింతయేల యుల
చక్రిని గోళ్లను నిల్పలేదె యో
శ్రుతిపథగోచరీ త్రిపుర
సుందరి మకజులకంబుకంధరీ॥ 14

ఉ॥ ఏ నొనరించుచుండునవి
    యెల్లను పాపములైనగాని నే
వానికి భీతినొందనల
    భానుఁడు గాఢతమంబువ్రాలె నీ
ధ్యానమడంచు గావునను
    దాని నొనంగుము దోసిలొగ్గితిఁ
నూనని భాంగి శ్రీత్రిపుర
    సుందరి మంజులకంబుకంధరీ॥ 15

ఉ॥ పారముముట్ట వీవిషయ
    వాంఛలు, మోహమడంగిపోవ, దా
చారముసున్న, నిల్వదెద
    శాంతము, చిత్తమునిల్పజాల, ని
ష్కారణమైన నీకృపనుగాక
    నినుంగననేర్చువాఁడనే
నూరిజనేద్య శ్రీత్రిపుర
    సుందరి మంజులకంబుకంధరీ॥ 16

ఉ॥ పున్నె మొకట్టియే నెఱుఁగ,
భూరితరంబగు పాపకార్యముల్
మిన్నకచేసినాఁడ, నిక
మీఁదెటులో, శరణంటినీకు, నా
పన్నశరణ్య! నాదయిన
ప్రాప్తమునీమనసెట్టులున్నదో
సున్ననుజుట్టకో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 17

చ॥ దురితపథంబునం జొరక
దుష్టమనంబెటునిల్చు? నీపదాం
బురుహసమర్చనంబునను
బుద్ధికినిల్కడయెట్లుగల్గు? నిర్
వరముల వేడఁగాఁదగిన
భాగ్యమదెప్పుడుగల్గు? దెల్పుమీ
స్ఫురితదయామయీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 18

చ॥ ననుసకలేశ్వరీ దృఢమ
నంబుననిల్పినుతింపలేవు నీ
యనకుము, కొండయంతటిమ
హాత్మ్యనకుందగుఁ గొండయంతప
త్రినొసఁగువారలుర్విఁ గల
రేయొకదండమొసంగు వాఁడదా
సునిగనుమమ్మ శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 19

చ॥ జననిరోనీదువర్ణనకుఁ
జాలినవస్తువు లేకయుంటనే
మనుచువచింతువాఙ్మనసు
లందవటంచురు సర్వలోకమో
హినివగునీదుచక్కదన
మీశుఁడుగాకితరుం డెఱుంగనే
ర్చునె? జగదంబ! శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 20

చ॥ ఎడ నెడదుర్గ్రహాంబులు మ
హీస్థలిపైబడి ప్రాణికోటులం
గడువడి బాధసల్పునెడ
గ్రమ్మఱదానకు బీజవర్ణముల్
నుడివినిర్మ స్మరింపదహా
నుపుపయింబకు మిత్తులట్లుగా
నుడివడిపోనె శ్రీత్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 21

ఉ॥ భూతినిబూసి, యాపుసుక
పూసలుదాల్చి, శ్మశానవాటిలో
నేతిరుగాడు చుందిరిపె
మెత్తుచుఁబాములపేర్లుబూనుసీ
చేతనధీశుఁగా, శశిమ
ణీయుతుఁగా, బహుదాతఁగా, జగ
త్ఖ్యాతిఁగఁ, జేసితో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 22

చ॥ ఒకఁడిడెఁ బాదదానము, మ
ఱొక్కఁడుఁ డర్థమొసంగె, నూఁడుపా
తికలిడె వేఱొకండు, వెలి
తింగొననీయక సర్వమిచ్చితి
వకలుషితాంతరంగయుతు
లైన మహాత్ములకంచు వేడితిఁ
శుకమృదువాణి శ్రీ త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 23

ఉ॥ కొందఱు శత్రునాశమున
కుఁ మఱిగొందరు వైభవంబుకై ,
కొందఱు పుత్రరాజికొఱ
కుఁ మఱి గొందఱు జ్ఞానవృద్ధికిఁ
గొందఱు భుక్తిముక్తులకుఁ
గోత్రఫలంబు నొసంగి నీదు దా
సుందరి జేప్పునం ద్రిపుర
— సుందరి మంజులకంబుకంధరీ॥ 24

చ॥ అవిరళ దివ్యరత్నమకు
టాన్వితమై తిలకాభిరామమై
నవజలజేక్షణద్వితయ
నంద్రితమై మణిభూషణాఢ్యమై
ప్రవిమల పూర్ణ చంద్రువలె
భాసిలు నీ నగుమోము నాదు చ
క్షువులకుఁ జూపుమో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 25

ఉ॥ మంగళమూర్తివై సకల
మంగళముల్ పొనరించు నీకు నే
మంగళహారతుల్ విమల
మానసవీధి ఘటింతు నిత్యముఁ
మంగళముల్ ఘటించుచు న
మంగళముల్ దొలఁగించి నీవు దా
సుం గరుణింపువం త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ 26

ఉ॥ పావనచిత్తులై వెలయు
భక్తుల కాన్కల కానఁబూనెనా
నోవనజాయతాక్షి యిదె
యుత్పల చంపకమాలికాఢ్య తా
రావళి నిత్య నిర్మల స
మంచిత భక్తిని నీకొసంగితిఁ
నూవె గ్రహింపుమో త్రిపుర
సుందరి మంజులకంబుకంధరీ॥ ౨7

చ॥ కలితకృపాకటాక్షమునఁ గాంచుచుఁ బిల్లలమఱ్ఱి వంశ్యులన్ । విలసిత నాగలింగ బుధ వేంకమ్మ పుత్రులఁ బ్రీతి సోమ,యాజులు మఱియాంజనేయుఁడ ను సోదరులన్ నినునమ్మికొల్చు దాసులమము నేలుమో త్రిపురసుందరి మంజులకంబుకంధరీ॥ 28

శ్రీ త్రిపుర సుందరీ పరదేవతార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ



